గురుదేవుని గ్రంథమాల : ౩

# ఊర్వశి

(ఇరువది గద్య పద్యముల సంపుటి)

9089

శ్రీ రవీంద్రనాథ ఠాకూరు

అనువాదకులు :
బెజవాడ గోపాలరెడ్డి

త్రివేణీ పబ్లిషర్సు
మచిలీపట్టణము

ప్రథమ ముద్రణము : ఫిబ్రవరి ౧౯౫౩

వంగమాతృకలనుంచి అనువాదితములు.

విశ్వభారతివారు అనుమతించినవి.

రూపాయిన్నర



ది జ్యూపిటర్ ప్రెస్ లిమిటెడ్, 16, పెంబుదాసు వీధి, మద్రాసు - 1

భక్తి శ్రద్ధలతో

గురుతుల్యులు

ఆంధ్రసాహిత్య విమర్శకాగ్రేసరులు

కీర్తిశేషులు

శ్రీ శ్రీ ముట్నూరి కృష్ణరావుగారికి

శ్రీ శ్రీ డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారికి

(౧౦-౧౨-౧౮౮౦—౨౪-౨-౧౯౫౧)

లాభము—

ఆంధ్రదేశమున రవీంద్ర సంస్కృతిని
వ్యాపకమొనర్చుటకై వినియోగింపబడును.

## శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారిచే అనువదింపబడి ప్రచురింపబడిన రవీంద్రుని పుస్తకములు.

| | | |
|---|---|---|
| ౧. | దేవయాని - చిత్రాంగద | సెప్టెంబరు ౧౯౪౪ |
| ౨. | ఆరు నాటికలు | జనవరి ౧౯౫౧ |
| ౩. | ఊర్వశి | ఫిబ్రవరి ౧౯౫౩ |
| ౪. | విసర్జన | ఫిబ్రవరి ౧౯౫౩ |

(మొదటి ముద్రణ ఏప్రెల్ ౧౯౪౭)

ప్రచురింపబడనున్నవి :—

కథలు - కల్పనలు
మాలిని - సన్యాసి
నైవేద్యము - స్మరణ
లిపిక

## A TRIBUTE

*How shall we find words to praise one whose genius flows so abundantly in lyric grace of its own immortal loveliness and shines so exquisitely in the radius of its own rainbow-coloured light ?*

*In his life-time Dr. Tagore became the legend of enchantment to the world, after his death he has become an inspiration to all human hearts that respond to the undying message of beauty, wisdom and truth.*

DR. SAROJINI DEVI.
*August 1943.*

# విన్నపము

'ఊర్వశి' లోని ఇరువది పద్యములు రవీంద్ర సాహిత్యములో ప్రసిద్ధికెక్కినవాటిలో కొన్ని. నూతన ధోరణిలో అనువదించి ప్రచురింప సాహసించితిని. సహృదయులు మన్నించెదరుగాక.

వీటిని పద్యములవలె చదువరాదు. గద్యమువలెనూ కాదు. బెంగాలీ పద్యములనువలె, అంటే ఇంగ్లీషు పద్యములరీతి చదివిన బాగుండును.

ఇందులోని 'శివాజీ - ఉత్సవము', 'అరవిందు' సర్కారుచే నిషేధింపబడినవి, ౧౯౪౩ సం॥లో గ్రంథరూపమున 'పూరబి' అను దానిలో తొలుత ప్రచురింపబడినవి.

రవీంద్రుడు ౧౮౯౦ సం॥నుండి ౧౯౦౫ సం॥వరకు రచించిన అనేక పద్యములలో ఇరువది మాత్రము ఏరికొని అనువదించితిని. ఎక్కువగ వారి యౌవన కాలములో వ్రాసినవే.

ఇందలి విసంధులు, పదముల అపూర్వ ప్రయోగములు మూలము యొక్క అనుకరణే. వంగసాహిత్యము తొలుత ఆక్షేపించి, తర్వాత గ్రహించినది. మనకు ఎంతవరకు గ్రాహ్యములగునో ముమ్ముందు చూడవలసి యున్నది.

నన్ను అన్నివిధముల ప్రోత్సహించి, నాపై వాత్సల్యాభిమానముల చూపుచుండిన శ్రీ ముట్నూరి కృష్ణారావుగారికి, శ్రీ డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారికి దీనిని అంకితమిచ్చి నా ఋణభారమును కొంత లఘువగునట్లు చేయ సంకల్పించితిని. వారి దివ్యస్మృతిని పదిలముగ దాచుకొనవలె ననుటయే నా కోరిక.

# విషయసూచిక

# ఊర్వశి

## ౧

మాతవు కావు, కన్యవు కావు, వధువు కావు,
సుందరి రూపసివి
ఓ నందన వాసినీ ఊర్వశీ,
శాద్వలముల సంధ్య వ్రాలినపుడు, స్వర్ణాంచలము
లాగ శ్రాంత దేహమున
నీవు ఏ గృహప్రాంతమునను వెలిగింపవు
సంధ్యాదీపముల.
సంశయజడిత పాదములతో, కంప్రవక్షముతో,
నమ్రనేత్రపాతముతో
స్మితహాసమున వెడలవు సలజ్జిత శోభనగృహమునకు
స్తబ్ధ అర్ధరాత్రమున.
ఉషోదయ సమముగ అనవగుంఠితవు
నీవు అకుంఠితవు.

వృంతహీన పుష్పసమముగ, నీలోనీవు వికసించి
ఎప్పుడు నీవు ప్రస్ఫుటించితివి ఊర్వశీ,
ఆదిమ వసంత ప్రాతమున లేచితివి మంథితసాగరమున
దక్షిణ హస్తమున సుధాపాత్రము, వామకరమున
విషభాండము.
తరంగిత మహాసింధువు, మంత్రశాంత భుజంగము రీతి
పడియుండెను పదప్రాంతమున, ఉచ్ఛ్వసిత
ఫణ లక్షశతముల
అవనత మొనర్చి.
కుందశుభ్ర నగ్నకాంతి సురేంద్ర వందితవు
నీవు అనిందితవు.

ఎన్నడైన ఉంటివా ముకుళిక బాలిక వయస్వినివై
ఓ అనంత యౌవన ఊర్వశీ,
అంధకారసింధుతలమున, ఏకాకినివిగ కూర్చొని
ఎవరి గృహమున
మాణిక్య ముక్తములతో నొనర్చితివి
శైశవా ఖేలనముల ?
మణిదీప దీప్త కక్ష్యముల, సముద్ర
కల్లోల సంగీతముల
అకళంక హాస ముఖమున, ప్రవాళపర్యంకమున
నిద్రించెడి దానవు
ఎవరి అంకమున ?
విశ్వమున మేల్కాంచినపుడే, యౌవనఘటితవు
పూర్ణ ప్రస్ఫుటితవు.

౪

యుగయుగాంతరములనుండి నీవు కేవలము
విశ్వప్రేయసివి
ఓ అపూర్వశోభన ఊర్వశీ,
ధ్యానభంగ మొనర్చి మునులు, నీ పదతలమున అర్పింతురు
తపఃఫలముల.
నీదు కటాక్షఘాతమున, త్రిభువనములు యౌవన
చంచలములు.
నీదు మదిరగంధమును మోయును నల్గడల
అంధవాయువులు.
మధుమత్త భృంగసమముగ, ముగ్ధకవి
తిరుగును లుబ్ధచిత్తముతో
ఉద్దామ సంగీతముతో.
నూపురముల ముఖరించుచు వెడలెదవు, ఆకుల అంచలవు.
విద్యుత్ చంచలవు.

సుప్రభాతలమున ఎన్నడు నృత్య మొనర్చెదవో

పులకోల్లాసినివై

ఓ విలోల కల్లోల ఊర్వశీ,

ఛందచ్ఛందమున నృత్యమొనర్చును సింధుమధ్య తరంగ

దళము.

సస్యశీర్షముల వణకి కంపించిపోవును ధరాంచలము.

నీ స్తన హారమునుండి జారిపడును తారలు నభస్థలమున.

తన్ను పోగొట్టుకొనును చిత్తము అకస్మాత్తుగ పురుషుల

వక్షమున.

నాట్యమాడును రక్తధారలు.

తటాలున విసరిపడును నీ మేఖల దిగంతమున

ఓ అసంవృతా.

౧

స్వర్గ ఉదయాచలమున ఉషోమూర్తిమతివి నీవు
ఓ భువన మోహిని ఊర్వశీ,
జగత్తు అశ్రుధారలచే క్షాళితము నీ తను పేశలత.
త్రిలోక హృదయ రక్తముచే చిత్రితము
నీ చరణ శోణిమ.
ముక్తవేణి వివసనవై, వికసిత విశ్వవాంఛ
అరవింద మధ్యమున ఉంచితివి నీ పాదపద్మముల
అతిలఘుభారమున.
అఖిల మానస స్వర్గమున అనంతవిలాసినివి,
స్వప్న సంగినివి.

అదో వినుము, దిశదిశల నీకై రోదించుచున్నది రోదసి
ఓ నిష్కరుణ బధిర ఊర్వశీ,
మరలివచ్చునా ఇక ఈ ధరకు పురాతన ఆదియుగము
అతల అకూలమునుండి లేచెదవా
తిరిగి సిక్త కేశములతో
ఆ ప్రథమ తనువును ప్రదర్శించినపుడు
ప్రథమ ప్రభాతమున
నీ సర్వాంగములు క్రందించును సకలుర
నయనాఘాతముల
వారిబిందు పాతముల.
అకస్మాత్తుగ మహాంబుధి అపూర్వసంగీతమున
పొంగును తరంగితమై.

మరలిరాదు, మరలిరాదు,- అస్తమించెను ఆగౌరవశశి
అస్తాచల వాసిని ఊర్వశీ,
అందుననే, నేడు ధరాతలమున వసంత
ఆనంద ఉచ్ఛ్వాసములతో
కలిసి వీచుచున్నవి, ఎవరి చిరవిరహాపు
దీర్ఘ శ్వాసములు ?
పూర్ణిమా నిశీథమున, పరిపూర్ణ హాసము
క్రమ్మునెడ దశదిశల
ఎచ్చటనుండియో మ్రోగించును దూరస్మృతి,
వ్యాకులకర వేణువును
రాల్చును అశ్రురాసుల.
అయినను, జాగృతమై యుండును ఆశ,
ప్రాణక్రందనముల.
ఓ అబంధనా !

మాతృక :
'చిత్ర'
౮-౧౨-౧౮౯౫

అనువాదము :
౧-౨-౧౯౪౪
Fugitive—XI

౨

# పతాకము

౧

నీ పతాకమును యిచ్చిన వారికి
వహించుటకు యిమ్ము శక్తిని.
నీ సేవల మహాప్రయాసమును
సహించుటకు యిమ్ము భక్తిని.
నేను అదే కోరుచున్నాను నిండు ప్రాణముతో
దుఃఖముతోటి దుఃఖత్రాణమును.
నీ హస్తముల వేదనాదానమును
తప్పుకొని కోరుట లేదు ముక్తిని.
దుఃఖము అగును నా తలమానికము
కూడ నిచ్చిన భక్తిని.

౨

నీవు యివ్వఁగోరినంత పని నిమ్ము
నిన్ను మరవనటుల చేయుము.
హృదయము చిక్కుపడ నియ్యకుము
జాల జంజాటావళి యందు.
బంధించుము నన్ను నీకు యిచ్చ వచ్చిన త్రాళ్లతో
ముక్తుఁడుగ నుండనిమ్ము నీవైపు నన్ను.
ధూళియందు ఉంచుము, పవిత్ర మొనర్చి
నీ చరణ ధూళియందు.
మరపించి ఉంచుము సంసారతలమున
నిన్ను మాత్రము మరవ నియ్యకుము.

నీవు తిరగమన్న మార్గముననే తిరిగెదను
నీ చరణములకడ నేను చేరెదను.

సకలశ్రమలు నన్ను మోసికొని పోనిమ్ము
సకల శ్రాంతిహరణ ధామమునకు.

చేరరాని విశ్వముయొక్క పోరాని పథము.
ఎన్ని త్యాగములు, శోకములు,
విరహదహనములు.

జీవితమునందు, మరణమును మోసి
ప్రాణమును పొందుచున్నాను మరణమున
సంధ్యావేళలయందు పొందెదను కులాయమును
నిఖిల శరణ చరణములను.

నైవేద్య ౧౯౦౧ }

అనువాదము: ౨౫-౮-౧౯౪౩.

# 3

# నవ వర్షా

౧

నా హృదయము నృత్యముచేయుచున్నది నేను
మయూరముమాడ్కి నృత్యముచేయుచున్నది.
హృదయము నృత్యముచేయుచున్నది.
శతవర్ణముల భావోచ్ఛ్వాసములు
కలాపమువలె వికాసము నొందుచున్నవి.
ఆకుల ప్రాణము ఆకసమును కాంచుచు
ఉల్లాసమున దేనిని యాచించుచున్నదో!
నా హృదయము నృత్యము చేయుచున్నది నేను
మయూరముమాడ్కి నృత్యముచేయుచున్నది.

౨

గురుగురు మేఘములు తిరుగుచు తిరుగుచు
గర్జించుచున్నవి గగన గగనమున.
గర్జించుచున్నవి గగనమున.
పరుగిడి ఏతెంచుచున్నవి వర్షధారలు.
పచ్చపైరు నారలు ఊగుచున్నవి జోరుగా
కులాయమున కంపించుచున్నది కాతర కపోతము
మండూకము సఘనముగ అరచుచున్నది.
గురుగురు మేఘములు తిరుగుచు తిరుగుచు
గర్జించుచున్నవి గగన గగనమున.

3

నా నయనముల సజల మేఘముల
నీలాంజనము అలముకొనెను.
నయనముల అలముకొనెను.
నవ తృణదళముల, ఘన వనచ్ఛాయల
నా హర్షమును పరచివైచితిని.
పులకితము నీపనికుంజము నేడు.
వికసితప్రాణము జాగృతము.
నయనముల సజల స్నిగ్ధమేఘముల
నీలాంజనము అలముకొనెను.

3. శరత్ వర్షా

౪

ఒహో, ప్రాసాద శిఖరమున నేడు
ఎవరని కేశముల విరబోసికొనెను.
కబరిని విప్పి విరబోసికొనెను.
ఒహో, నవఘన నీలవసనమును
వక్షముపైకి ఎవరు లాగికొనునది.
తటిత్ శిఖా చకిత దీప్తియందు
ఒహో, ఎవరని విలాసముగ మరలుచున్నది.
ఒహో, ప్రాసాద శిఖరమున నేడు
ఎవరని కేశముల విరబోసికొనెను.

౫

ఒహో, నదీకూలమున తీరతృణతలమున
ఎవరు కూర్చొనియున్నది అమలవసనములతో
శ్యామల వసనములతో
సుదూరగగనమున ఎవరిని ఆమె చూచుచున్నది,
రేవునువదలి కలశము ఎచ్చటికి తేలిపోవుచున్నది,
నవమాలతీ పేశల దళముల
అన్యచిత్తమున దంతముల కొరకుచున్నది.
ఒహో, నదీకూలమున తీరతృణతలమున
ఎవరు కూర్చొనియున్నది శ్యామల వసనములతో.

౬

ఓహో, నిర్జనమున వకుళశాఖయందు
ఉయ్యాల ఎవరు నేడు ఊగుచున్నది.
ఉయ్యాల ఊగుచున్నది.
జేల జేల రాలుచున్నవి వకుళములు.
అంచలము ఆకసమున అగుచున్నది ఆకులము.
ఎగిరి అలకలు క్రమ్ముచున్నవి లలాటమును
కబరి విడి విచ్చుచున్నది.
ఓహో, నిర్జనమున వకుళశాఖయందు
ఉయ్యాల ఎవరు నేడు ఊగుచున్నది.

౭

వికచ కేతకీతట భూమియందు
ఎవరు కట్టివేసినది వారి తరణిని,
తరుణ తరణిని.
రాసులు రాసులుగ ఎత్తి శైవాల దళముల
నింపివైచెను లోలాంచలమును.
మేఘరాగిణుల సజల నయనముల
గానమొనర్చుచున్నది ప్రాణహారముగ.
వికచ కేతకీతట భూమియందు
కట్టివేసినది తరుణతరణిని.

౩. నవ వర్షా

౮

నా హృదయము నృత్యముచేయుచున్నది నేను
మయూరముమాడ్కి నృత్యముచేయుచున్నది.
హృదయము నృత్యముచేయుచున్నది.
పడుచున్నవి వర్షధారలు నవపల్లవములపై
కంపించుచున్నది కాననము ఝిల్లీరవములచే
తీరముల ఒరసి నది కలకల్లోలములతో
వచ్చివేసెను పల్లె దగ్గరకు
నా హృదయము నృత్యముచేయుచున్నది నేను
మయూరముమాడ్కి నృత్యముచేయుచున్నది.

క్షణిక : ౧౯౦౦

అనువాదము : ౧-౮-౧౯౪౪.

౪

# భారత తీర్థము

౧

నా చిత్తమా, మేల్కాంచుము మెల్లగ
పుణ్యతీర్థమున,
ఈ భారత మహామానవ
సాగర తీరమున.
ఇచ్చోనిలిచి, రెండు చేతులు ఎత్తి
నమస్కరింపుము నర దేవతకు
ఉదార ఛందమున పరమానందమున
వందన మొనర్చుము అతనికి.
ధ్యానగంభీరములు, ఇదో ఈ భూధరములు
నదీజపమాలల వహించినవి కాననములు.
ఇచ్చో నిత్యము కాంచుము పవిత్ర
ధరిత్రిని
ఈ భారత మహామానవ
సాగర తీరమున.

## ౮. భారత తీర్థము

౨

ఎవరికిని ఎఱుక లేదు ఎవరి ఆహ్వానమున
ఎన్ని మానవధారలు
ఏతెంచెను ఎచ్చటనుండో దుర్వార స్రోతమున
సముద్రమున కలిసిపోయినవి.
ఇచ్చట ఆర్యులు, ఇచ్చట అనార్యులు
ఇచ్చట ద్రావిడులు, చీనులు
శక హూణ దళములు, పఠానులు మొగలులు
ఏక దేహమున అయిరి లీనము.
పశ్చిమమున నేడు తెరచెను ద్వారము
అచ్చటనుండి అందరు తెచ్చిరి ఉపహారము
ఇచ్చెదరు, గైకొనెదరు, కలిపెదరు, కలిసెదరు
మరలి వెడలరు.
ఈ భారత మహామానవ
సాగరతీరమున.

సమరధారల దాటి, జయగానముల వాసి

ఉన్మాద కలరవమున

భేదించి మరు పథముల, గిరి పర్వతముల

ఏ అందరు వచ్చిరో

వారు మా మధ్య విరాజిల్లుచున్నారు

ఎవరు లేరు లేరు దూరము.

మా శోణితముల అగుచున్నవి ధ్వనితము

వారి విచిత్ర స్వరములు.

రుద్రవీణా, మ్రోగుము, మ్రోగుము, మ్రోగుము

ఏవగింపుతో దూరముగ ఎవరున్నారో నేడును,

బంధనములు నాశనమగును, వారును వచ్చెదరు

చుట్టుచేరి నిలిచెదరు.

ఈ భారత మహామానవ

సాగర తీరమున.

## ౮. భారత తీర్థము

౪

ఇచ్చో. ఒకనాడు విరామ విహీనముగ
మహా ఓంకారధ్వని,
హృదయతంత్రుల ఏకత్వపు మంత్రమున
మ్రోగిపోయెను గణగణ.
తపోబలమున, ఏకత్వపు అనలమున
ఆహుతి నొసగి బహుత్వమును
విస్మరించి విభేదముల, జాగృతమై లేచెను
ఒక విరాట హృదయము.
ఆ సాధనల, ఆ ఆరాధనల
యజ్ఞశాలయందు తెరవుము నేడు ద్వారమును
ఇచ్చట అందరి కలయిక ఒనకూరును
ఆనత శిరములతో
ఈ భారత మహామానవ
సాగర తీరమున.

౫

ఆ హోమానలమున చూడుము నేడు జ్వలించుచున్నది.

దుఃఖపు రక్త శిఖలు.

అంతరదహనము, సహించుటకు కలదు వడివిడి

అది మన నొసటి వ్రాతయై యున్నది.

ఈ దుఃఖమును వహించుము, నా మనమా

వినుము ఏకత్వపు ఆహ్వానమును.

ఉన్న లజ్జల, భయముల జయించుము, జయించుము

అవమానములు దూరములై పోనిమ్ము.

దుఃసహావ్యథల అవసానమై

జన్మించునా ఏమి విశాలప్రాణము!

తెల్లవారను రేయి, మేల్కొని లేచుచున్నది తల్లి

విపులమగు నీడమున

ఈ భారత మహామానవ

సాగర తీరమున.

పుట ౨౧

## ౪. భారత తీర్థము

౬

రండు ఆర్యులారా, రండు అనార్యులారా,
హిందూ ముసల్మానులారా,
రండు రండు నేడు ఆంగ్లేయులారా,
రండు రండు క్రైస్తవులారా,
రండు బ్రాహ్మణులారా, శుభ్ర మొనర్చి
మీ చిత్తముల
వహింపుడు సకలుర హస్తముల.
రండు పతితులారా, అపనీతమగు గాక
సమస్త అవమానభారము.
మాతృ అభిషేకమునకై, రండు రండు త్వరగా
మంగళ కలశము కాలేదు భరితము,
అందరి స్పర్శచే పవిత్ర మొనర్చబడిన
తీర్థ నీరములచే
నేటి భారత మహామానవ
సాగర తీరమున.

గీతాంజలి
జూలై ౧౯౧౦

అనువాదము :
౨-౭-౧౯౪౪

## ౫

# అవమానితులు

## ౧

ఓ నా దౌర్భాగ్య దేశమా, ఎవరిని కావించితివో అవమానము
అవమానములలో కావలసియున్నది వారందరి సమానము.

మానవుల అధికారము నుండి
వంచిత మొనర్చితివో ఎవరిని

సమ్ముఖమున నిలిపియుంచియు అంకమున నొసగ లేదో స్థానము
అవమానములలో కావలసియున్నది వారందరి సమానము.

## ౨

మానవుల స్పర్శను అనుదినము తప్పించి దూరముగ
గర్హించితివి నీవు మానవుల ప్రాణ దేవతను.

విధాతృని రుద్రరోషమున
కూర్చొని దుర్భిక్షద్వారమున

భాగించి భుజించవలసియున్నది సకలురతోటి అన్నపానము
అవమానములలో కావలసియున్నది వారందరి సమానము.

3

నీ ఆసనమునుండి ఎచ్చట వారిని గెంటి వైచితివో
ఆచ్చట నీ శక్తిని అవహేళనమున నిర్వాసన మొనర్చితివి.
చరణములక్రింద దళితులై
ధూళిలో వారు తేలిపోదురు.
ఆ నిమ్నస్థానమునకు దిగిరమ్ము, లేకున్న లేదు పరిత్రాణము
అవమానములలో కావలసియున్నది వారందరి సమానము.

౪

ఎవరిని నీవు క్రిందికి నెట్టెదవో, వారు క్రింద నిన్ను కట్టివేసెదరు.
వెనుక ఎవరిని ఉంచితివో, వారు నిన్ను వెనుకకు లాగెదరు.
అజ్ఞానపు అంధకారమున
మరుగున కప్పియుంచితివో ఎవరిని
నీ శుభములకప్పి నిర్మించుచున్నారు వారు ఘోరవ్యవధానము.
అవమానములలో కావలసియున్నది వారందరి సమానము.

౫

శతశతాబ్దములనుండి శిరమున వ్రాలుచున్నది అసన్మాన భారము
మానవుల నారాయణుని, అయినను, నీవు నమస్కరించుట లేదు.

ఇంకను నత మొనర్చి నయనముల
వీక్షింపలేకున్నావా ఏమి
దిగివచ్చెను ధూళితలమునకు, హీనపతితుల భగవానుడు
అవమానములలో కావలసియున్నది వారందరి సమానము.

౬

వీక్షింపలేకున్నావా నీవు, మృత్యుదూత
నిలిచియున్నాడు ద్వారమున
అభిశాపచక్షువుల నిగిడ్చెను
నీ జాతి అహంకారమున
అందరిని పిలువకున్న
ఇప్పటికి తొలగియున్న
నిన్ను నీవు బంధించియుంచుకొన్న,
నల్గడల మునిగి స్వాభిమానమున
మృత్యుమధ్యమున కావలసియున్నది,
చితాభస్మములలో అందరి సమానము.

గీతాంజలి
జూలై ౧౯౧౦

అనువాదము :
౨-౭-౧౯౪౪

౬

# ఉత్కృష్ట మూల్యము

౧

"ఎవరు తీసికొనెదరు కొని నన్ను, ఎవరు తీసికొనెదరు కొని?"
నన్ను అమ్మునతను అరచి అరచి తిరుగును రాత్రిదినములు.
ఈ విధముగ అయ్యో, నాదు
దినములు గడచిపోవును.
తలపై భారమునాది, విషమ
బాధ్యతయాయెను
కొందరు వచ్చెదరు, కొందరు నవ్వెదరు,
కొందరు ఏడ్చుచు చూచెదరు.

౨

మధ్యదినమున తిరిగెదము
పాషాణఘటిత రాజపథమున
ముకుటము మస్తకమున, అస్త్రములు
హస్తమున, రాజు ఏతెంచెను రథమున
చెప్పెను చెయిపట్టి "నిన్ను
కొనెదను నేను బలాత్కారమున."
ఉన్న బలము తుదముట్టిపోయెను లాగులాటలలో.
ముకుటము మస్తకమున, మరలెను రాజు ఎక్కి స్వర్ణరథమును

3

మూయబడిన వాకిలి ఎదుటగా, తిరుగుచుంటిమి సందులో
ద్వారము తెరచి, వృద్ధుడు ఏతెంచెను, చేతిలో నవరాలనుంచి.
చెప్పెను, ఆలోచించి చూచి
కొనెదను బంగారమునిచ్చి
పాడుచేసికొని సంచిని, నడచెను విసుగున గొణుగుతు
బరువైన శిరముపై మోసి, ఎచటికో వెడలితిమి అన్యమనమున.

౪

సంధ్యవేళయందు వెన్నెల ప్రాకెను, ముకుళభరిత పాదపముల
సుందరి యువతి బయటికి వచ్చెను, వక్షఃతలసమీపమున
చెప్పెను దగ్గర వచ్చి "నిన్ను
కొనెదను నేను నవ్వుతో"
నవ్వు నయనజలములలో కలిసిపోయెను చివరకు
నెమ్మది నెమ్మదిగ మరలి వెడలెను వనచ్ఛాయల ప్రాంతమునకు.

## ౬. ఉత్కృష్ట మూల్యము

౫

సాగరతీరమున లేయెండలు వ్యాపించెను,
అలలు ఎగురుచుండెను జలముల
గవ్వలతో ఆడుచుండెను ముద్దుబిడ్డ,
దొర్లుచు పులినసైకతముల
నన్ను గుర్తించినటుల చెప్పెను
"ఊరకనే గైకొనెద కొని"
నాదుభారము తేలికనై
పోయెను అప్పుడే ఆ నాడే
ఆటలసుఖమున, వినా మూల్యముతో,
గైకొనెను నన్ను జయించి.

గీతిమాల్య
౭-౧-౧౯౧౩
అమెరికా

అనువాదము :
౫-౭-౧౯౪౪

## ౭

# శివాజి - ఉత్సవము

### ౧

ఏ దూర శతాబ్దమున, ఏ ఒక
అఖ్యాతదివసమున
నాకు తెలియదు నేడు
మహారాష్ట్రపు ఏ శైలమున, అరణ్య
అంధకారముల కూర్చొనియుండ
ఓ రాజా శివాజీ,
నీ లలాటమును ఉద్భాసించుచు
ఈ భావము తటిత్ప్రభాసమముగ
వచ్చెను అవతీర్ణమై
"ఏకధర్మరాజ్యపాశములచే,
ఖండ ఛిన్న విక్షిప్త భారతవర్షమును
బంధించి వేసెదను నేను."

౨

ఆ దినము ఈ వంగ దేశము ఉచ్చకితమై
మేల్కొనలేదు స్వప్నములనుండి
పొందలేదు సమాచారముల,
వెలుపలికి రాలేదు పరుగిడి,
చెలరేగలేదు ఆమె ప్రాంగణమున
శుభ శంఖానాదములు.
శాంతముఖముతో పరచి
తన కోమల నిర్మల
శ్యామల ఉత్తరీయమును
తంద్రాతుర సంధ్యాకాలముల,
శతగ్రామ సంతాన సంతతుల
వక్షమున చేర్చుకొనియుండెను.

౩

అటుపిమ్మట, ఒకదినము

మహారాష్ట్రపు కాననములనుండి

నీ వజ్రశిఖలు

చిత్రించివైచెను దిగ్దిగంతముల,

యుగాంతర విద్యుత్ వహ్నిచే

మహామంత్ర పాశముల.

మొంగలాయిల తలపాగల కొసలు, ప్రళయ

ప్రదోషముల కంపించుచున్న వృక్ష

పక్వపర్ణముల పగిది,—

ఆ దినమును వినలేదు వంగదేశము,

మహారాష్ట్రుల ఆ వజ్ర నిర్ఘోషముల

ఏ వార్తలు అణగియుండెనో!

౪

అటుపిమ్మట, శూన్యములాయెను,
ఝంఝాక్షుబ్ధ నిబిడ నిశీథముల
దిల్లీ రాజమహలులు.
ఒకటొకటిగ, ఒక్కొక్కగదిలో
చీకట్లలో కలియసాగెను
దీపకాంతి మాలలు.
శవలుబ్ధములగు రాబందుల
ఊర్ధ్వస్వర బీభత్సచీత్కారములలో
మొగల్ మహిమ
రచించెను శ్మశానశయ్యను,—
ముష్టిమేయ భస్మరేఖాకారములలో
నిలిచిపోయెను దాని సీమలు.

ఆనాడు ఈ వంగప్రాంతమున,
        పణ్యవిపణుల చెంత
నిశ్శబ్ద చరణముల
తెచ్చిరి వణిక్శ్రీమంతులు,
        సురంగపథ అంధకారములలో
రాజ సింహాసనము.
వంగదేశము వారిని తన
        గంగోదకములచే అభిషిక్త మొనర్చి
స్వీకరించెను గోపనముగ.
వణికుల మానదండము కాన్పించెను,
        రేయి ముదిరి రాలగనే
రాజదండ రూపమున.

౭. శివాజీ - ఉత్సవము

౧

ఆనాడు ఎచ్చట నీవు, ఓ భావికుడా,
ఓ వీరమరాఠీ
ఎచ్చట నీ నామము.
గైరికపతాకము నీది ఎచ్చట
ధూళిలో మలినమై యుండెను
తుచ్ఛ పరిణామము.
విదేశీ యితిహాసములు దస్యుడవని
చేయును పరిహాసము
అట్టహాస రవములతో
నీ పుణ్యచేష్టలన్నిటిని, తస్కరుని
నిష్ఫల ప్రయాసలని
ఇది అందరికి తెలిసినదే.

౭

ఓ ఇతిహాసపు గాథా, ఆపివేయుము
నీ ముఖర భాషణాలు
ఓ మిథ్యామయీ,
నీ లేఖనలపై విధాతృని
అవ్యర్థ లేఖనములు
అగును నేడు విజయములు.
ఏది మరణింపనేరదో, దానిని
ఎట్లు అణచివేయగలవు
నీ వ్యంగ్యబాణాలు?
ఏ తపస్సు సత్యమో, దానిని ఎవడును
బాధింపలేడు ముల్లోకములలో
అది నిశ్చయమని తెలియును.

౧

రాజ తపస్వీ వీరుడా,
నీ ఆ ఉదార భావన
విధాతృని భాండారమున
సంచితమై పోయెను, కాలము
దాని ఒక కణమునైన ఎన్నడైన
పోగొట్టుకొన గలుగునా?
నీ ఆ ప్రాణోత్సర్గలు, స్వదేశ
లక్ష్మీపూజా మందిరమున
ఆ సత్య సాధనలు
ఎవరికి ఎరుక, అగునని చిరయుగ
యుగాంతరములకై
భారతవర్ష సంపద.

౯

అఖ్యాతముగ, అజ్ఞాతముగ ఉండి
దీర్ఘకాలము, రాజన్యై రాః,
గిరిదరీ తలముల
వర్షముచే నిర్ఝరములై, శైలముల
చీల్చుచు మార్గాని చేసునో
పరిపూర్ణబలముతో
ఆ దేవమాత్రిక బయటికి వచ్చినది - సమస్త
ప్రపంచము విస్మయమున అనుకొనెను.
ఎవరి పతాకము
అంబరాచ్ఛన్న మొనర్చుచున్నదో,
ఇంతకాలము ఇంతక్షుద్రమై
ఎచ్చట మాటుబడి యుండెను.

౧౦

ఆ విధముననే తలపోయుచున్నాను,
కవినగు నేను, ఈ పూర్వభారతమున
ఎట్టి అపూర్వముల కాంచుచున్నాను.
వంగదేశ ప్రాంగణద్వారమున, ఎటుల
ఎచటినుండి ధ్వనితమాయెను
నీ జయభేరి ?
త్రిశత వర్షముల గాఢతమ
తమస్సుల చీల్చుకొని
నీ ప్రతాపము
ఈ ప్రాచీదిగంతమున నేడు నవతరములగు
ఏ మయూఖముల ప్రసరించి
ఉదయించెను తిరుగ ?

చావదు, కాలదు ఎన్నటను
సత్యమైనది. శతశతాబ్దముల
విస్మృతి తెలములు.
చావదు ఉపేక్షలచే, అవమానములచే
అస్థిరము కాదు,
ఆఘాతములచే కదలనేరదు.
దేనిని అందరు తలచిరో,
ఏ కాలముననో నిశ్శేషమాయెనని
కర్మ పరపారమున,
ఆ [illegible] సత్యము వచ్చెను ప్రాజ్య
అతిథి వేషము ధరించి
భారతవర్ష ద్వారమున.

౧౨

నేడును దాని ఆ మంత్రము, దాని
ఆ విశాల నయనములు
భవిష్యత్తు వైపు
ఏకదృష్టితో తిలకించుచున్నవి, అచ్చట
అవి ఏ మహాదృశ్యమును
కాంచెనో, ఎవరికెరుక ?
అశరీరుడవగు తాపసీ, కేవలము
నీ తపోమూర్తిని గైకొని
వచ్చితివి నేడు
అయినను నీ పురాతనమగు ఆ శక్తిని
తెచ్చితివి మోసికొని
ఆ నీ కార్యమును.

శేష: పక్ష: శ్వేత ధ్వజములు, శ్వేత
సైన్యములు, రణ అశ్వదళములు
ఖరతర అస్త్రములు.
నేడు ఇక మ్రోగుట లేదు, అంబరమును
ఉన్మాద మొనర్చు
హార హార హార హార.
కేవలము నీ నామము నేడు పితృ
లోకము నుండి దిగివచ్చెను
ఆహ్వాన మొనర్చెను.
ముహూర్తమున హృదయాసనమున
నిన్నే వరించెను, స్వామీ
వంగ దేశీయుల ప్రాణము.

ఈ మాటను ఎవరును అనుకొని యుండలేదు,
ఈ మూడు శతాబ్దములుగ
తలచలేదు స్వప్నములలోను.
నీ మహానామము వంగ-మహారాష్ట్ర
ముల ఏక మొనర్చెను
ఎట్టి యుద్ధము లేకనే.
నీ తపోతేజము దీర్ఘకాలము
అంతర్ధానమై యుండి
నేడు అకస్మాత్తుగ
మృత్యుహీన వాణీరూపమున తెచ్చి
యిచ్చెను నూతనప్రాణమును
నూతన ప్రభాతమున.

మహారాష్ట్ర ప్రాంతమునుండి ఒక నాడు,
    శత్రురాజా, నీవు
పిలిచినప్పుడు
రాజువని తెలియదు, స్వీకరించ లేదు,
    లజ్జను పొందియుండ లేదు
ఆ భైరవ రవమున.
నీ కృపాణదీప్తి ఏనాడు
    మిరుమిట్లు గొల్పెనో
వంగ దేశపు ఆకసమున
ఆ ఘోర దుర్భాగ్య దినమున తెలిసికొన
    లేకపోతిమి ఆ రుద్రలీలల
దాగితిమి త్రాసమున.

౨. శివాజీ - ఉత్సవము

౧౬

మృత్యు సింహాసనముపై నేడు
కూర్చుంటివి అమరమూర్తీ
సమున్నత లలాటమున
ఏ రాజ కిరీటము శోభిల్లునో, దాగదు
దాని దివ్యజ్యోతి,
ఎన్నడును ఏ కాలమునను.
నిన్ను గుర్తించితిమి నేడు, గుర్తించితిమి,
గుర్తించితిమి రాజా
నీవు మహారాజువు.
నీ రాజకరమును గైకొని అష్టకోటి
వంగ నందనులు
నిలిచెదరు నేడు.

ఆనాడు వినలేని మాటను, నేడు

మేము నీ ఆదేశమును

తలయొగ్గి గైకొనెదము.

కంఠకంఠమున, వక్షవక్షమున, భారత

వర్షమున కలియును సర్వదేశములు

నీ ధ్యాన మంత్రమున.

ధ్వజము చేసి ఎగరవేయుదుము

వైరాగుల ఉత్తరీయ వస్త్రమును

దరిద్రజనుల బలము.

'ఏక ధర్మ-రాజ్యము అగును ఈ భారత

వర్షము' అను ఈ మహావచనమును

చేసెదము మూల ధనము.

మహారాష్ట్రులతోటి నేను వంగ దేశీయులారా,
ఏక కంఠమున పలుకుదు
"జయతు శివాజీ"
మహారాష్ట్రులతోటి నేను వంగ దేశీయులారా,
ఒకే అడుగున వెడలుదు
మహోత్సవమునకై అలంకరించి.
నేను ఏకసభాతలమున, భారతవర్షపు
పూర్వ పశ్చిమములు
ఉత్తర దక్షిణములు
ఒకేచోట ఒకటిగా అనుభవింపనిందు,
ఒకే గౌరవమును
ఒకే పుణ్యనామమున.

౯౦౪. ౧౪-౮-౪౪.

## ౮

# రెండు పక్షులు

## ౧

పంజరపు పక్షి ఉండెను స్వర్ణపంజరమున
అరణ్యపక్షి ఉండెను అరణ్యమున.
ఒకప్పుడు ఎటులనో సమ్మేళన ఘటించెను రెండింటికి
ఏ ఉద్దేశ్యముండెనో విధాత్రుని మనమున.
అరణ్యపక్షి చెప్పెను "పంజరపు పక్షీ, అన్నా,
అడవికిపోయెదము, ఇద్దరముకలిసి"
పంజరపుపక్షి చెప్పెను "అరణ్యపక్షీ, రమ్ము
పంజరమున ఉండెదము నిశ్చింతగా"
అరణ్యపక్షి చెప్పెను—"వద్దు
నేను శృంఖలముల చిక్కుకొనను"
పంజరపుపక్షి చెప్పెను "అయ్యో
నేను ఎటుల వనమునకై బయట రాగలను"

౨

అరణ్యపక్షి పాడెను బయట కూర్చొని కూర్చొని
ఉన్న వనగానములన్ని.
పంజరపుపక్షి చదువును దానికి నేర్పిన మాటలను
ఇద్దరి భాషలు రెండు విధములు.
అరణ్యపక్షి చెప్పెను "పంజరపుపక్షీ, అన్నా
వనగానములు పాడుము చూస్తాము"
పంజరపుపక్షి చెప్పెను "అరణ్యపక్షీ, అన్నా
పంజరపుపాటను నేర్చుకొను"
అరణ్యపక్షి చెప్పెను—"వద్దు
నాకు నేర్పబడిన పాటలు అక్కర లేదు"
పంజరపుపక్షి చెప్పెను—"అయ్యో
నేను ఎటుల వనగానములు పాడగలను."

అరణ్యాపక్షి చెప్పెను "ఆకాశము ఘన నీలము
ఎచ్చటను అడ్డంకులు లేవు దానికి"
పంజరపుపక్షి చెప్పెను "పంజరమే మెరుగు
ఎటుల కప్పబడియున్నది నాల్గువైపుల"
అరణ్యాపక్షి చెప్పెను "నిన్ను వదలివేసికొనుము
మేఘములమధ్య ఒకేసారిగ"
పంజరపుపక్షి చెప్పెను "నిశ్చింతగ సుఖకోణమున
బంధించి ఉంచుకొనుము నిన్ను"
అరణ్యాపక్షి చెప్పెను—"వద్దు
అచ్చట ఎటుల ఎగరగలను?"
పంజరపుపక్షి చెప్పెను—"అయ్యో
మేఘములలో ఎచ్చట కూర్చునుటకు స్థానము."

౪

ఇటుల రెండుపక్షులు ఒకటినొకటి ప్రేమించుకొనెను.
కాని దగ్గర చేరజాలకున్నవి.
పంజరపు సందుసందులతో, స్పర్శించుకొనెను
ముఖముఖముల
నీరవముగ కండ్లకండ్ల చూచుకొనుచుండెను.
ఇద్దరు ఎవరు ఎవరిని తెలిసికొనలేకపోయిరి
తెలిపింపలేకపోయిరి తమ్ములను.
ఇద్దరు ఒక్కొక్క విసరు విసరి రెక్కల
శోకమున అనెడివి "దగ్గరకు, రా"
అరణ్యపక్షి చెప్పెను—"వద్దు
ఎప్పుడో పంజరమున మూయబడును ద్వారము"
పంజరపుపక్షి చెప్పెను—"అయ్యో
లేదు నాకు శక్తి ఎగురుటకు"

సోవార్‌తరి :
జాలై ౧౯౫౩

అనువాదము :
౫-౮-౧౯౪౪
Gardener—VI

౯

# మానసి

కేవలము విధాతృని సృష్టి కావు నీవు నారీ;
పురుషులు రచించిరి నిన్ను, సౌందర్యముల సేకరించి
తమ అంతరములనుండి; కూర్చుని కవిబృందములు
సువర్ణ ఉపమా సూత్రములచే నేసిరి వసనముల;
సమర్పించి నీపై నూతన మహిమలను
అమర మొనర్చిరి శిల్పులు నీ ప్రతిమను;
ఎన్ని వర్ణములు, ఎన్ని సుగంధములు, ఎన్నెన్ని
భూషణములు!
సింధువునుండి ముత్యములు వచ్చెను, ఖని నుండి స్వర్ణము;
వసంతవనములనుండి ఏతెంచెను పుష్పగుచ్ఛములు;
చరణముల చిత్రించుటకై ఒసగెను ప్రాణముల కీటకములు;
లజ్జల చేకూర్చి, అలంకారములచే అలరించి,
ఆభరణముల తొడిగి
నిన్ను దుర్లభ మొనర్చి, దాచివేసిరి గోపనముగ.
వర్షింపబడుచున్నవి నీపై ప్రదీప్త వాంఛా ధారలు.
సగము మాత్రమే మానవివి నీవు, సగము కల్పనవు.

చైతాలి:
మార్చి ౧౮౯౬)

అనువాదము:
౨౧-౮-౧౯౪౪
Gardener—LIX

# ౧౦

# విచిత్ర రూపిణి

జగత్తున ఎంత విచిత్రవు నీవు
　　నీవు విచిత్ర రూపిణివి.
సహస్రదీప్తులచే మిరుమిట్లుగొల్పుచున్నావు నీలగగనమున
ఆకుల పులకముల పొంగించుచున్నావు పుష్పకాననమున
స్వర్గభూలోకముల విలసించుచున్నావు చలచరణముల
　　నీవు చంచలగామినివి.

ముఖరనూపురములు మ్రోగుచున్నవి సుదూరగగనమున
అలక గంధము ఎగురుచున్నది మందపవనమున.
మధురనృత్యముచే నిఖిలచిత్తముల వికసించును
　　ఎన్నెన్ని మంజుల రాగిణులు.

ఎన్ని వర్ణములచే ఎన్ని స్వర్ణములచే ఘటితము.
ఎన్ని ఛందములచే ఎన్ని సంగీతములచే ప్రకటితము.
ఎన్ని గ్రంథములలో ఎన్ని కంఠములచే పఠితము
　　నీదు అసంఖ్యాగాథలు
జగత్తున ఎంతవిచిత్రవు నీవు
　　నీవు విచిత్ర రూపిణివి.

అంతరమున కేవలము నీవు ఏకైకినివి
నీవు అంతరవ్యాపినివి.
స్వప్నమవు ముగ్ధసజలనయనముల
పద్మమవు హృదయ వృంతశయనమున
శశివి అసీమచిత్త గగనమున
నాల్గు దిక్కుల చిరయామిని.

అకూల శాంతి, అచ్ఛో విపుల విరతి,
భక్తులు ఒసగుచున్నారు నిత్యము ఆరతి,
లేవు కాలదేశములు, నీవు అనిమేషమూర్తివి,
నీవు అచపల దామినివి.

ధీర గంభీర మౌన మహిమవు
స్వచ్ఛ అతల స్నిగ్ధనయన నీలిమవు
స్థిరస్మితమున ఉషాలోక సమ అసీమవు.
ప్రశాంత హాసినివి.
అంతరమున నీవు కేవలము ఏకైకినివి
నీవు అంతరవాసినివి.

చిత్రా : }
౧౯౭౫ }

అనువాదము :
౫-౭-౪౪
Fugitive—51

౧౧

# ఇద్దరు నారీమణులు

౧

ఏక్షణమున
సృజన సముద్ర మంథనమున
లేచిరి ఇద్దరు నారీమణులు
అతల శయ్యాతలమును వదలి.

ఒక తె—ఊర్వశి, సుందరి,
విశ్వ కామనా రాజ్యమున రాణి
స్వర్గ అప్సరి.
ఇంకొక తె—లక్ష్మి, ఆమె కళ్యాణి.
విశ్వజననియని ఆమెను ఎరుగుదుము.
స్వర్గ ఈశ్వరి.

౨

ఒక తె తపోభంగమొనర్చి
ఉచ్ఛ్వాస అగ్నిరసమున ఫాల్గుణసుధా
పాత్రమునునింపి
గైకొనిపోవును ప్రాణ మనముల
హరించి,
రెండుచేతులతో వెదజల్లుచు దానిని,
వసంతపుష్పిత ప్రలాపముల,
రాగ రక్త కింశుకముల, గులాబీ
పుష్పముల
నిద్రావిహీన యౌవనగానముల.

౩

ఇంకొక తె మరల్చి తెచ్చును
అశ్రు శిశిరస్నానముల
స్నిగ్ధ వాంఛలను;
హేమంత హిమకాంత సఫల శాంతి పూర్ణతలను.
మరల్చి తెచ్చును
నిఖిలుర ఆశీర్వాదముల వైపు
అచంచల లావణ్యస్మితహాస మధురసుధలను.
మరల్చి తెచ్చును మెల్లగ
జీవన మృత్యువులను
పవిత్ర సంగమ తీర్థ తీరముల
అనంత పూజా మందిరముల.

బలాకా :
ఫిబ్రవరి ౧౯౧౫

అనువాదము :
౨౧-౮-౪౪
Lovers' gift—LIV

౧౨

# వసంత

౧

సహస్రవత్సర కృతము, వసంతా, ప్రథమ ఫాల్గుణమున
మత్త కుతూహలివై
ప్రథమమున ఏనాడు తెరచి నందన దక్షిణద్వారమును
ఏతెంచితివో మర్త్యలోకమున!
అకస్మాత్తుగ నిలచితివి మానవకుటీర ప్రాంగణముల
ధరించి పీతాంబరముల,
ఉత్క్షిప్త ఉత్తరీయమునుండి వెదజల్లుచు
ఉన్మాద పవనములలో
మందార మంజరుల—
గుంపులు గుంపులుగ స్త్రీపురుషులు పరుగిడి
వచ్చిరి, గృహద్వారముల తెరచి
గైకొని వీణల వేణువుల
మత్తిల్లి పిచ్చి నృత్యములతో, నవ్వుచు కొట్టుచుండిరి
విసరుచు పుష్ప రేణువుల.

౨

మిత్రమా, ఆ అతిదూర సద్యోజాత ఆది
మధుమాసమున
తరుణ ధరణికి
కొని తెచ్చితివి కుసుమముల, ముంచి తప్తకిరణముల
స్వర్ణ మదిరమున ;
ఆ పురాతన ఆ శాశ్వత అనంత ప్రవీణమగు
నవ పుష్పరాజముల
వత్సరవత్సరము తెచ్చుచున్నావు ; వాటితో నేడుమరల
అలంకరించితివి ప్రేమ పీఠమును.
ఆ పుష్పములలోనే వ్రాయబడియున్నది, జగత్తు
ప్రాచీన దినముల
విస్మృత వార్తలు ;
వాటి గంధములలో తేలుచున్నది, క్లాంత లుప్త
లోకలోకాంతరముల
మనోహర మధురత.

అందువనే నేను ప్రస్ఫుటిత నిబిడ నికుంజవనమునుండి
వ్యాపించుచున్నవి నిట్టూర్పులతో
లక్షదివయామినుల యౌవన విచిత్రవేదనలు
అశ్రువులు, గానములు, హాసములు.
ఏ మాలను అల్లితినో నేడు, నీకు సమర్పించుటకు
ఉపహారముగ
దాని ప్రతి దళమునందును
పేరులు మాసిన నాయికల పురాతన ఆకాంక్షాగాథలు
చిత్రితమైనవి అశ్రునీరముల.
నీహారశీకర సిక్తములు, నవోన్ముక్తములు
అగు గులాబీల
అరుణ పత్ర పుటముల
ఎన్నో కంపిత కుంఠిత అగణ్యాచుంబన ఇతిహాసములు
ముద్రితమై నిలిచియున్నవి.

౪

నా వసంతరాత్రమున నాలుగుదిక్కుల
పై కెగసి పర్వెనో
ఏ కొలది తలపులు,
నీ కుసుమములు, వసంతా, వాటి గుప్త
సమాచారముల
ఎచ్చో గైకొనిపోయెనో!
ఆ విరజాజి, ఆ వకుళము, ఆ చంచలచకిత చంపకము
స్మిత శుభ్రముఖులు.
తరుణి పరిమళమాధవి, ఉల్లాస ఉత్సుఖ ఉన్నమిత
అత్యంత కుతూహలిని.
కొన్ని వసంతములలో, అవి నా యౌవన
కావ్య గాథలను
పఠించినవి.
ప్రక్క ప్రక్క దాగి, అవి వినినవి మిథున వక్షముల
మనోరథ మురళి.

౫

వ్యర్థజీవితపు ఆ కొన్ని పరమాధ్యాయములు
ఓ మధుమాసమా
నీ కుసుమగంధములలో, వత్సర వత్సరము,
శూన్యమున జలమున, భూమిపై
ప్రకాశమును పొందును.
వకుళ-చంపకములతో, అవి అల్లబడి
నిత్యము వెడలగలవు
యుగ యుగాంతరములు.
వసంత వసంతమున అవి కుంజకుంజమున
పుష్పించును ఆకులములై
కుహూకల స్వరమున.
అమర వేదన నాది, వసంతా, ఉండిపోయెను నీదు
మర్మర నిశ్వాసముల.
ఉత్తప్త యౌవన మోహము రక్త రౌద్రమున
రంజితమాయెను
చైత్ర సంధ్యాకాశమున.

కల్పన: ౧౯౦౦

అనువాదము: ౯-౧౦-౫౭

పుట ౬౧

౧౩

# ప్రణయ ప్రశ్న

౧

అటులైన, అది అంతయు సత్యమా,
ఓ నా చిరభక్తుడా,
నా చక్షు విద్యుదుజ్జ్వల కాంతిచే
నీ హృదయ ఝంఝామేఘము
ప్రకాశించునా,
నా మధుర అధరము, వధూ
నూత్నలజ్జాసమముగ
ఆరక్తము
అది సత్యమా!

చిర మందారము వికసించునా నా

అంతరమున

నా చరణముల మ్రోగునా

వీణాఝుంకారములు

నిశి శిశిరముల రాల్చునా

నన్ను చూచి

ప్రభాత కాంతి నన్ను పరివేష్టించి పులకితము

అది సత్యమా

తప్తకపోలస్పర్శచే, మదిరమత్త

సమీరము అధీరమా

ఓ నా చిరభక్తుడా

అది సత్యమా.

౧౩. ప్రణయ ప్రశ్న

౩

నా కృష్ణకుంతలపాశములలో దివసములు
దాచును అంధకారముల
జీవన మరణ బంధనములు, నా మృణాల
బాహు నిబద్ధములు
భువనము మైమరచును నా చేలాంచల
కంపనమున
విశ్వము నీరవము, నా మధురకంఠ
కల గానమున
అది సత్యమా,
త్రిభువనములు నా కనుసన్నల నర్తిలుచుండ,
నా అనురక్తులతో నేను కాంచుచున్నాను
ఓ నా చిరభక్తుడా
అది సత్యమా!

నీ ప్రణయము యుగయుగముల నుండి
నా కొరకు
లోక లోకాంతరముల వెతకుచు
తిర్గుచుండెను.
నా వచనమున, నయనమున,
అధరమున, అలకమున
చిరజన్మముల విరామము లభించెను
ముహూర్తమున
అది సత్యమా,
అసీమతత్వము లిఖితము నా సుకుమారి
లలాట ఫలకమున.
ఓ నా చిరభక్తుడా,
అది సత్యమా.

కల్పన :
రైలులో, ౧౯౨౪

అనువాదము :
౧౫-౧౨-౫౩
Gardener—XXXII

## ౧౪

# అరవిందు

అరవిందు, రవీంద్రుని నమస్కారముల స్వీకరింపుము.
మిత్రమా, దేశబంధూ, స్వదేశ ఆత్మయొక్క
వాణీమూర్తివి నీవు.
నీ కొరకై లేదు మానము, లేదు ధనము,
లేదు సుఖము.
ఎట్టి అల్పదానముల కోరవు, ఎట్టి అల్పకృపలను ;
భిక్షను అర్థించి ఆతుర అంజలిని చాపవు.
సర్వబాధాహీనమగు పరిపూర్ణతకొరకై
జాగరణ చేయుచున్నావు—
దేనికొరకు నరులు, దేవులు చిరరాత్రిదినములు
తపోమగ్నులో
మహావీరులు అందరును సంకటయాత్రలకై వెడలిరో,
దేనిమ్రోల విశ్రాంతి లజ్జితశిరమును అవనత
మొనర్చెనో
మృత్యువు భయమును మరచెనో,

అట్టి విధాతృని శ్రేష్ఠదానమగు నీ పూర్ణ
అధికారమును—
కోరితివి దేశమునకై అకుంఠిత ఆశతో,
సత్య గౌరవ గర్వితమగు ప్రశస్త భాషయందు,
అఖండ విశ్వాసమున.
ఏ ప్రార్థనను నేను విధాత వినెనా?
అందుననే అతని జయశంఖలు మ్రోగుచున్నవా?
అందుననే నీ దక్షిణ కరమున నేను
కఠోర ఆదరమున దుఃఖదారుణ దీపమును ఒసగెనా?
దాని కాంతి వెలిగి, దేశ అంధకారముల రూపుమాపి
ధ్రువతార మాదిరి ప్రకాశించునా?
జయము, నీకు జయము.
ఎవరు నేను అశ్రువుల రాల్చునది, ఎవరు
భయపడునది,
తన్ను రక్షించుకొనుటకై ఏ కాపురుషుకు
సత్యమును భంగమొనర్చునది?
నీ వేదననుండి ఏ అమానుషుడు
బలమును సేకరింపడు?
దుర్బలులారా, తుడువుడు కన్నులను,
తుడువుడు కన్నీటిని.

## ౧౪. అరవిందు

దేవతల దీపమును హస్తమున నిడి పృథ్వికి వచ్చిన
ఆ రుద్రదూతతో చెప్పుము, ఏ రాజు ఎన్నడు
శిక్షనొసగగలడు? అతని బంధన శృంఖలములు
చరణముల ప్రోల కూలి నమస్కరించును.
కారాగారములు సత్కారముల చేయగలవు.
కుపిత రాహువు విధాతృని మార్తాండుని వైపు
చేతులచాపి, ఒక ముహూర్తము పిదప తనే
ఛాయవలె విలుప్తమై పోవును.
శిక్షయా, శిక్ష అతనికి—, ఎవడు
శిక్షాభయమున, స్వనిర్మితమిథ్యాప్రాకారముల
కపట పరివేష్టనముల దాటి బయటపడడో,
ఏ నపుంసకుడు ధర్మమువైపుచూచుచు, ఎన్నడును
నిర్భయుడై, స్వతంత్రుడై అన్యాయమును
అన్యాయమని అననేరడో;
తన మనుష్యత్వమును, విధి దత్తమగు నిత్య
అధికారములను
నిర్లజ్జాభయమున, లోభమున అస్వీకార మొనర్చునో
సభా మధ్యమున నిలిచి.
దుర్గతిక్షై అహంకారపడుచుండునో;
దేశ దుర్దశమీదనే ఎవరి వ్యాపారమో;

మాతృరక్తప్రాయమై నిషిద్ధములగునవి
ఎవరికి భోజ్యమో
ఆ అవనతశిరస్కుడగు భీరువునకు, శాశ్వతశిశు అతనికి
రాజ కారాగారమునుండి బయటపడగా
విత్త కారాగారము.

బంధనముల, పీడనల, దుఃఖముల అసన్మానముల మధ్య
నీ మూర్తినిచూచి నా కర్ణముల మ్రోగుచున్నవి
ఆత్మయొక్క బంధనహీనమగు ఆనందగానములు,
మహాతీర్థ యాత్రికుల సంగీతములు,
శాశ్వతప్రాణముయొక్క ఆశోల్లాసములు,
ఉదార మృత్యువుయొక్క గంభీర నిర్భయవాణులు.
కవీ, భారతవీణాపాణీ, నీ ముఖమున దృష్టినిలిపి
తంత్రీతంత్రుల విపుల ఝంకారముల మ్రోగించెను—
అందు లేవు దుఃఖతానములు, లేవు క్షుద్రలజ్జలు,
లేవు దైన్యములు, లేవు త్రాసములు.
అందుననే నేడు వినుచున్నాను,
ఎచ్చటనుండియో, ఝంఝాఫీత్కారములతో
సింధు గర్జనలను ;
పాషాణపంజరముల బద్ధులుచేసి

అంధ వేగమున గంతు లిడు
నిర్ఘర ఉన్మత్త నర్తనలను ;
భేరీ మంద్రనినాదములలో వజ్రగర్జరవములు
భైరవ మేఘపుంజముల మేల్కొలుపును.
ఈ ఉదాత్త సంగీత తరంగముల విరాజిల్లు
అరవిందు, రవీంద్రుని నమస్కారముల స్వీకరింపుము.

తదనంతరము, ఆతనికి నమస్కరింతును, ఎవడు
క్రీడాచ్ఛలమున ప్రళయ అనలములలో
నూతనసృష్టిని నిర్మించునో,
మృత్యువునుండి ప్రాణము నొసగునో,
విపదల వక్షమున సంపదల బుజ్జగించునో,
హాసముఖముతో భక్తుల కంటకారణ్యములకు
రాత్రి అంధకారములలో శత్రు మధ్యమునకు
రిక్త హస్తములతో అనుపునో ;
ఎవడు నానాకంఠముల పలుకునో, నానా
ఇతిహాసములలో
సకల మహోత్తర కార్యములలో, సకల పరమ
ప్రయాసలలో
సకల చరమ లాభములలో "దుఃఖము ఎద్దియు లేదు,

గాయములు మిథ్యలు, నష్టములు మిథ్యలు,
సర్వ భయములు మిథ్యలు ;
ఏడీ మిథ్యయగు రాజు, ఏది అతని రాజదండము ;
ఏది మృత్యువు, ఏది అన్యాయుల అత్యాచారము !
భీరువులారా, మూఢులారా, ఎత్తుడు ఎత్తుడు శిరముల
నే నున్నాను, నీవు ఉన్నావు, సత్యము ఉన్నది
స్థిరముగ."

ఆగష్టు ౧౯౦౩.

అనువాదము :
౧౫-౮-౪౪
అరవిందు జన్మదినమున.

## ౧౫
# వర్షామంగళము

౧

అదో వచ్చె అదో, అతి భైరవహర్షమున
జల సించిత క్షితి సౌరభ ఆహ్లాదమున
ఘనగౌరవమున, నవ యౌవన వర్షము
శ్యామగంభీర సరసి.
గురు గర్జనమున నీల అరణ్యము కంపితము.
ఉన్మత్త కలాపి కేకాకలరవముల విహారితము
దిగ్వధూ చిత్త హర్షము
ఘనగౌరవమున, వచ్చివేసెను మత్తవర్షము.

౨

ఏరీమీరు ఓ తరుణీపథిక లలనలు
జనపదవధువులు, తటిత్ చకితనయనలు
ఏరీ, మాలతీ మాలినీ ప్రియచారికలు
ఏరీ మీరు, అభిసారికలు.
ఘనవనతలమునకు రండు ఘననీల వసనలు
లలిత నృత్యముల మ్రోగనిండు పైడి అందియలు
తెండు వీణల మనోహారికలు
ఏరీ విరహిణులు, ఏరీమీరు, అభిసారికలు.

౩

తెండు మృదంగము, మురజము, మురళి మధువులారా,
మ్రోగింపుడు శంఖముల, పలుకుడు మంగళ
వచనముల వధువులారా
వచ్చెనువర్షము, ఒహో నవ అనురాగిణులు
ఒహో, ప్రియసుఖ భాగినులు.
కుంజ కుటీరమున, ఓ భావాకులలోచనలు,
భూర్జ పత్రముల రచించుడు నవగీతముల
మేఘ మల్హార రాగిణులు.
వచ్చెను వర్షము, ఒహో, నవ అనురాగిణులు.

౪

కేతకీ కేసరములచే కేశపాశములచేయుడు సురభితము
క్షీణ కటితటముల అల్లి ధరింపుడు కరవీరపుష్పములు.
కదంబరేణువుల పరచివేయుడు శయనముల
అంజనము అలముడు నయనముల
తాళ తాళమున, రెండు కంకణముల ఘల్లుమనిపించి
భవనమయూరమును నాట్యమాడింపుడు ఒకటిరెండనుచూ
స్మితవికసిత వదనములతో
గదంబరేణువుల పరచివేయుడు పుష్పశయనముల.

## ౧౫. వర్షామంగళము

౧

స్నిగ్ధ సజల మేఘకజ్జల దివసముల
వివశములు యామములు అచల అలస ఆవేశముల.
శశితారాహీనము, అంధతమస్విని యామిని
ఏరీ మీరు, పురకామినులు.
నేడు ద్వారములు మూయబడియున్నవి నగరభవనముల
జనహీనపథము క్రందించుచున్నది క్షుబ్ధపవనముల
మెరయుచున్నవి దీప్త దామినులు,
శూన్యశయనముల ఎచ్చో మేల్కొనియున్నారు,
పుర కామినులు.

౨

మల్లికాపరిమళములు ఏతెంచుచున్నవి సజలసమీరముల
అరచుచున్నవి భేకములు తమాల కుంజతిమిరముల
మేల్కొనుము సహచరీ, నేటి నిశిని మరవకుము
నీపశాఖల కట్టుము ఉయ్యేలలు
కుసుమపరాగము రాలుచున్నది ఊపు ఊపున
అధర అధరముల కలియుచున్నవి అలక అలకములు
ఏరీ పులకితులనలు
నీపశాఖల, సఖీ, పూల త్రాళ్లతో కట్టుము ఉయ్యేలలు.

వచ్చెను వర్షము, వచ్చెను నవీన వర్షము
గగనభరితమై వచ్చెను భువన ఆశ్వాసము.
ఊగుచున్నవి ముఖరసమీరముల వనవీథికలు
గీతిమయములు తరులతికలు.
శతయుగముల కవిదళములు చేరి ఆకసమున
వల్లించుచున్నారు మత్తమదిర అనిలములలో
శతయుగముల గీతికలు.
శతశత గీతముఖరిత వనవీథికలు.

కల్పన: }
౧౯౫౪ }

అనువాదము:
౧౩-౮-౧౯౪౪

## ౧౬

# ప్రతిదానము

౧

పక్షులకు ఇచ్చితివి గానముల, పాడును అవి గానములు
అంతకన్న అధికముగ చేయవు అవి దానములు
నాకు ఒసగితివి స్వరమును, నేను అంతకన్న
అధికముగ చేయుదు దానము
నేను పాడెద గానము.

౨

వాయువును చేసితివి స్వతంత్రము.
సహజముగనే అది బంధనవిహీనమగు నీ కింకరి.
నాకు ఎంతో ఇచ్చితివి భారమును
అందుననే మోసికొనిపోవుదును మార్గమున
కొన్నిసారులు వంకరగ, కొన్నిసారులు నేరుగ,
ఒకటొకటిగ పారవేసి బరువుల, మరణ మరణమున
తీసికొనిపోయెద నీ చరణములకు
ఒక దినము సేవలనుండి స్వతంత్రములైన రిక్తహస్తముల,
నా కొసగిన బంధనముల, ముక్తిలో విలీనమొనర్చి.

౩

పౌర్ణిమకు ఇచ్చితివి హాసము ;
సుఖస్వప్న రసరాశిని
అందునసే క్రుమ్మరించుచున్నది,
పొంగుచున్న అమృతముల
ధరణీ కరపుటముల.
దుఃఖము నొసగితివి, ఉంచి నా తప్తలలాటమున
అశ్రుజలములచే దానిని కడిగి
ఆనందమొనర్చి దానిని, మరల్చి తెచ్చియిచ్చెద
కరములతో
దినాంతమున, మిలన రాత్రమున.

౪

నీవు నిర్మించితివి కేవలము మట్టితో ఈ ధరణిని
కలిపి వెలుగులతో చీకట్లను
శూన్యహస్తములతో అచ్చట నన్ను ఉంచి
నీలో నీవు నవ్వుకొనుచున్నావు,
శూన్యపు మరుగున రహస్యముగ దాగి.
ఉంచుచున్నావు నాపై బాధ్యతల
నీ స్వర్గమును నిర్మించుట కొరకు
మిగతవారందరికి నీవు ఇచ్చుచున్నావు
కేవలము నావద్దనుండి నీవు కోరుచున్నావు!

౫

నా ప్రేమలతో నేను ఒసగగల దానిని
సింహాసనమునుండి దిగి
దరహాసముఖముతో, వక్షమునకు ఎత్తి
తీసికొనుము.
నా హస్తములలోనికి దేనిని ఇచ్చెదవో
దానికన్న అధికముగ తిరుగ
నీచేతులలోనికి పొందెదవు.

బలాకా :
ఫిబ్రువరి ౧౯౧౫

అనువాదము :
౨౧-౮-౧౯౪౪

Fruit-gathering
LXXVIII

౧౭

# ఉచిత స్థానము

౧

ఏ సంతలో నీవు అమ్ముకు పో కోరెదవు
ఓ నా గానమా,
ఎచ్చట నీస్థానము!
పండితులు ఉండెదరో ఎచ్చట
విద్యారత్న పల్లెయందు
నస్యము ఎగిరి, ఆకసమును క్రమ్మి
ఎవరికి సాధ్యము నిలువను,
సాగుచున్నదో ఎచ్చట సూక్ష్మతర్కము
సర్వదా దివారాత్రములు
పాత్రాధారము తైలమా, లేక
తైలాధారము పాత్రమా,
పుస్తకములు శ్రేణులు తీర్చియున్నవి
మాయాతమస్సుల నాశనకరములు.
వాటిమధ్య ఒక ప్రాంతమున
పరవ కోరెదవా, ఏమి ఆసనము?
పాట అది విని, అరచుచు
అరచుచు చెప్పెను
లేదు, లేదు, లేదు.

## ౧౩. ఉచితస్థానము

౨

ఏ సంతలో నీవు అమ్ముడు పోకోలేదవు
ఓ నా గానమా,
ఏవైపున నీ ఆకర్షణ!
చలువరాతి ప్రాసాదములపై
ఉన్నాడు భాగ్యవంతుడు.
మెహాగినీ బీరువులలో అమర్చబడినవి
ఐదువేల గ్రంథములు.
బంగారుమెరుగు అక్షరములపై మచ్చపడదు
తెరవరు ఎవరు పుటలను.
అస్వాదిత మధువు మాడ్కి
మల్లిక అనాఘ్రాతము.
భృత్యులు నిత్యము దుమ్ము దులిపెదరు
పూర్తి యత్నములతో.
ఒరే నా ఛందోమయీ,
అచ్చటికి చేసెదవా యాత్ర?
పాట అది విని కర్ణమూలమున
మృదువుగ చెప్పెను
లేదు, లేదు, లేదు.

ఏ [illegible] చెప్పు అమ్మ్మా [illegible]
ఓ నా [illegible]
ఎచ్చోటు [illegible] [illegible]ము!
క్రొత్త [illegible] [illegible]గియున్నా[illegible]
పరీక్షాపాఠక గ్రంథములపై
మనస్సు మాత్రము ఎచ్చటనో ఉన్నది
ఏ దిక్కునో ఎగురుచున్నది.
చదివిన పుస్తకము, చదవని పుస్తకము
ఎదురుగా తెరవబడియున్నవి
పెద్దల భయముతో పుటలు
జోరుగా మరలుచున్నవి
అచ్చట చిందరవందరల
గందరగోళపు గుంపులు
వాటిమధ్య ఒకే చపలా
ఆడుకొనెదవా ఆటల!
పాట అదివిని వదనముఖమున
ఉండెను ద్విధాభరితమై,
పోయెదను, పోయెదను లేయని.

౪

ఏ సంతలో నీవు అమ్ముడు పో కోరెదవు
ఓ నా గానమా,
ఎచ్చట పొందెదవు పరిత్రాణము!
గదిలో అదృష్టపు కోడలు
పనుల పూర్తిచేయుచున్నది.
మేడపైకి పరువెత్తును, విశ్రాంతి దొరకినపుడెల్ల,
మధ్యమధ్య వీలున్నపుడు.
దిండు క్రింద దాచినది పుస్తకము
లాగి తీసికొని దానిని
పుటలన్నియు నలిగి చినిగెను
శిశువుల అత్యాచారమున,
కాటుక రాసి, కుంకుమ పూసి
కేశగంధముతో భరితములు.
ఆమె శయ్యాప్రాంతమున, ఛిన్నవేషముతో
త్వరగా వెడలుటకు కోరెదవా?
గుండియపై నిట్టూర్పు విడచి
మిన్నకుండెను పాట
తొట్రువడుచు లోభమున.

ఏ సంతలో నీవు అమ్ముడు పోకుందువు
ఓ నా గానమా
ఎచ్చట హేమంతపు ప్రాణము!
ఎచ్చట సుఖమున తిరుగాడును నిశము
ఉన్మత్తతో విహరింతురో
మరుగుల ఎదిగి, చీకట్ల నెమక
అందరికండ్లను ఏమార్చెదరో,
పక్షులు వారికి వినిపించును గీతికల
నదులు వినిపించును గాథల
ఎన్నిరకముల ఛందముల వినిపించును
పుష్పలతాపర్ణములు.
అచ్చటనే సరళహాసము
సజల నయనముల చెంతనుండును.
విశ్వవేణు రవముల మధ్యకు
ఏగ కోర్కె ఒదవుచున్నదా?
హఠాత్తుగ లేచి, నిట్టూర్చుచు
చెప్పెను నా పాట.
అహో, అదే నా స్థానము.

క్షణిక: }
౧౯౪౯ }

అనువాదము:
౪-౭-౪౪

౧౮

# మేఘ దూత

కవివరా, ఎన్నడు ఏ విస్మృత వర్షమున
ఏ పుణ్య ఆషాఢ ప్రథమ దివసమున
వ్రాసితివి మేఘదూతను. . మేఘమంద్రశ్లోకములు
విశ్వవిరహులకుగల సకలశోకముల
దాచినవి, వాటి క్రొత్త చీకట్ల దొంతరలను
సఘన సంగీతములమధ్య పుంజీభూత మొనర్చి.
ఆదినము, ఆ ఉజ్జయినీ ప్రాసాదశిఖరముల
ఎందులకో తెలియదు, మేఘతోరణములు,
విద్యుతోత్సవములు,
ఉద్దామ పవనగీతములు, గురుగురు రవములు
ఆ జలద సంఘర్షముల గంభీరనిర్ఘోషములు
లేపి లేవనెత్తెను సహస్ర వర్షముల
అంతర్గూఢ బాష్పాకుల విచ్ఛేదక్రందనముల
ఒకదినము. ఛిన్న మొనర్చి కాలబంధనముల
ఆదినము రాలి పడిపోయెను శాశ్వతముగ
చిర దివసముల ఆబద్ధ అశ్రురసముల
ఆర్ద్రి మొనర్చి నీ ఉదార శ్లోకపాదముల.

ఆదినము దేశదేశాలలోగల సకల ప్రవాసులు
బద్ధ హస్తులై, మేఘమువైపు శూన్యమున
శిరములెత్తి
పాడితిరి సమస్వరముల విరహగాథల
మరలి ప్రియగృహములకు: బంధిత విరహములకు
నవమేఘ పక్షములకై ఆశీనులై
అనుప కోరుచుంటిరి అశ్రుబాష్పభరములగు
ప్రేమవార్తల.—దూరవాతాయనము ప్రక్క
ముక్తకేశములతో, మ్లానవేషములతో. సజల
నయనములతో
భూతలశయనలై విరహిణి పరుండియుండిన స్థానమునకు.

వారందరి గానముల నీ సంగీతమున
పంపితివా ఏమి, కవీ, రాత్రి దివసములు
దేశ దేశాంతరములకు, విరహిణీప్రియులను వెదకుటకు!
శ్రావణ జాహ్నవి ప్రవహించుచు వెడలు విధమున
లాగి చేర్చుకొని దిశదిశాంతరముల వారి ధారల
మహాసముద్రములో విశాంతియగుటకు!
పాషాణశృంఖల బంధితమైన హిమాచలము
ఆషాఢమున, అనంతశూన్యమున స్వతంత్రములై

## ౧౮. మేఘ దూతి

గగన విహారములగు మేఘముల కాంచి
కాతరమున నిశ్వసించి సహస్రకందరములనుండి
బాష్పశకలముల పంపును గగనము వైపులకు.
పరువెత్తును అవి వెడలి పిచ్చికోర్కెలరీతి.
శిఖరములకు లేచి అన్నియు కలిసి, కడకు ఏకాకారమై
సమస్త గగనతలముపై పూనును అధికారము.

ఆదినము, పిదప, ఎన్నో వందలసారులు వెడలెను
దట్టమగు తొలకరుల తొలి దివసము.
ప్రతివత్సరము ఇచ్చి వెడలెను నూతన జీవము
నీ కావ్యములపై వర్షితమొనర్చి నవవృష్టిధారల,
విస్తారిత మొనర్చి నవఘనస్నిగ్ధచ్ఛాయల,
వ్యాపిత మొనర్చి జలదమంద్రముల నవనవ ప్రతిధ్వనుల,
పొంగించి నీఛంద స్రోతోవేగమును వర్షాతరంగిణీ
విధముగ.

ఎంతోకాలముగ ఎందరు విరహిజనులు
ప్రియారహిత గృహముల
వృష్టిక్లాంత, బహుదీర్ఘ, లుప్త తారాశశి
ఆషాఢ సంధ్యలందు, క్షీణదీపాలోకమున కూర్చొని

ఆ ఛందమును మందమందముగా ఒనర్చి ఉచ్చారణ
నిమగ్నము కావించిరి నిజవిజన వేదనను.
ఆ అందరి కంఠస్వరములు నా కర్ణముల తగులును
సముద్రతరంగ కలధ్వని సమముగ
నీ కావ్యముల నుండి.
భారతవర్షపు పూర్వప్రాంతమున
నేడు నేను ఉపవిష్టుడను. శ్యామల వంగ దేశమున
జయదేవకవి, మరియొక వర్షాదినమున
దిగంత తమాల విపిన శ్యామచ్ఛాయల
కాంచెను పూర్ణమేఘ మేదురాంబరమున.

నేడు అంధకార దివము, వర్షము జరజర పడుచున్నది.
అతి ప్రబలములు పవనములు, వాటి దాడిచే
ఉద్యత బాహువుల అరణ్యము హాహాకారముల
చేయుచున్నది.
మెరుపు తొంగిచూచుచున్నది, విదల్చి మబ్బులబరువును
వాడి వంకరనవ్వుల శూన్యమున వెదజిమ్ముచు.
అంధకార అవరుద్ధ గృహమున ఒంటరిగ కూర్చొని
చదువుచున్నాను మేఘదూతను. ఇల్లువిడిన డెందము
అడ్డులేని నడకతో మబ్బు వీపున కూర్చొని

దేశ దేశాంతరములకు ఎగురుచున్నది. ఎచ్చటకలదో
సానుయుత ఆమ్రకూటము! ఎచ్చట పారుచున్నదో
విమల విశీర్ణ రేవ వింధ్యాపదమూలమున
శిలా వ్యథిత గమనముతో! వేత్రవతీ తీరమున
పండిన నేరేడుపండ్ల నలుపు తోటల నీడలందు
ఎచ్చట దశార్ణ గ్రామము దాగియున్నదో
పూచిన మొగలి కంచెలచే చుట్టబడి.
రచ్చచెట్ల కొమ్మల ఎచ్చట ఊరిపిట్టలు
వానలలో కట్టుచున్నవో గూడుల తియ్యని రొదలతో
తిరుగుచు గుబురు కొమ్మల.

ఎరుక లేదు ఏనదీ తీరముననో
మల్లికావన విహారిణులగు వనాంగనలు
క్రుమ్మరు చుందురో,
తప్తకపోలముల తాపమున క్లాంత కర్ణోత్పలములు
మేఘచ్ఛాయలకొరకై వికలములగుచున్నవో,
ఎవరు భ్రూవిలాసముల నేర్వలేదో, అట్టి ఆ రమణులు
జనపదవధువులు, గగనమున అవలోకించి
ఘనాఘనముల, ఊర్ధ్వనేత్రములతో కాంచుదురు
మేఘముల వైపు—

మబ్బుల నీలినీడలు పడుచున్నవి నల్లని నయనముల.
ఏ మేఘశ్యామశైలముల ముగ్ధసిద్ధాంగనలు
స్నిగ్ధ నవఘనములచూచి ఉద్విగ్నహృదయులైరో
శిలాతలముల ; హఠాత్తుగ మహాఝంఝ రేగ
చకితలై, భయమున కంపితలై
గబగబ సవరించుకొనుచు వసనముల,
మరలుచున్నారో గుహాశ్రయముల వెతకుచు
"అమ్మో, గిరిశృంగములు ఎగురుచున్నవి" అని
అనుచుందురో,
ఎచ్చట అవంతీపురము ; నిర్వింధ్యాతటిని ;
ఎచ్చట శిప్రానదీ తీరముల చూచుకొనునో ఉజ్జయిని
స్వమహిమాచ్ఛాయలను.

అచ్చట రెండు ఝాములరేయి.
ప్రణయ చాంచల్యముల మరచినవి భవన
మయూరములు,
నిద్రించుచున్నవి పావురములు ; కేవలము
యౌవనవికారమున
రమణులు బయల్వెడలిరి ప్రేమ అభిసారముల,
సూచీభేద్య అంధకారమున, రాజపథమున

కొసరికొసరి కన్పట్టు మెరుపు వెలుగులలో.
ఎచ్చటవిరాజిల్లుచున్నది బ్రహ్మావర్తమున కురుక్షేత్రము.
ఎచ్చట కనఖల, ఎచ్చో ఆ జహ్నుకన్య
యౌవన చంచలము,
గౌరీభ్రుకుటిభంగిమముల నురుగు నవ్వుల నెపమున
పరిహసించుచు, ఆటలాడుకొనుచున్నదో
చంద్రకరోజ్వల ధూర్జటి జటలతోడ ?

ఈ విధముగ మేఘరూపమున తిరిగి దేశ దేశముల
హృదయము తేలిపోవును, కడకు వ్రాలుటకు
కామనల మోక్షధామమగు అలకాపురమున,
సౌందర్యపు ఆదిసృష్టియై విరహిణి ప్రియతమ
ఒప్పారుచున్నచోట. అచ్చటికి ఎవరు
గైకొని పోగలరు నీవు తప్ప, అడ్డంకుల కాలతన్ని
లక్ష్మీవిలాసపురికి——అమర భువనమునకు.
అనంత వసంతమున ఎచ్చట నిత్యము పుష్పవనముల
నిత్యజ్యోత్స్నాలహరులలో, ఇంద్రనీల
శైల మూలముల
సువర్ణ సరోజపుల్ల సరోవర కూలముల
మణిహర్మ్యములలో అసీమ సంపదలలో విరాజిల్లు

విరహావేదనాలలనలు విలపించుచున్నారు ఒంటరిగా!
ముక్తవాతాయనముల వారు కాన్పించెదరు
శయ్యాప్రాంతముల లీనతనులై, ప్రాఙ్వగగన
మూలమున
అస్తప్రాయమునగనున్న క్షీణశశి కళలవలె.
కవీ, నీ మంత్రమున నేడు ముక్తమైపోవును
అవరుద్ధమైయున్న హృదయ బంధన వ్యథలు.
చేరగలిగితిని విరహాస్వర్గలోకమును, ఎచ్చట
చిరనిసుల గడపుచున్నదో విరహిణీ ప్రేయసి
అనంత సౌందర్యముల మధ్య ఒంటరిగ మేల్కాని.

మరల పొగొట్టుకొంటిని – లేచి చూచుచున్నాను
నాల్గు వైపుల
వర్షము అవిశ్రామముగ పడుచున్నది, చీకట్ల
చిక్కబరచుచు
వచ్చుచున్నది ఒంటరి రేయి; అరుబయలు కొనలో
తెరపి లేని తలపులతో గాడ్పులు ఏడ్చుచు
చనుచున్నవి.
అర్ధరాత్రివేళ అనిద్రానయనములతో తలపోయు
చున్నాను

ఎవరొసగిరి ఇట్టి శాపముల, ఈ వ్యవధాన మేల?
రుద్ధమనోరథములు ఏల ఊర్ధ్వమును కాంచి
క్రందించు చున్నవి.
తమతమ ప్రేమములు ఏల ఒక మార్గమును
పొందజాలకున్నవి!
సశరీరముగ ఏనరుడు వెడలెను ఆ ధామమునకు
మానససరోవరతీరమునకు, విరహాశయనమునకు,
రవిహీన మణిదీప్త ప్రదోషముల దేశమునకు
ధరణిలోని నది గిరి సకలముల అంతమునకు!

మానవి :
మే ౧౯౫౦ }

అనువాదము :
౧౪-౫-౪౪

౧౮

# శత వర్షముల పిదప

౧

నేటి నుండి శతవర్షముల పిదప
ఎవరు నీవు చదువుచున్నావొ కూర్చొని,
నా పద్యముల
కుతూహల భరుడవై
నేటి నుండి శతవర్షముల పిదప.
నేటి నవవసంత ప్రభాతానందపు
లేశమాత్ర భాగమైన,
నేటి ఏ పుష్పములనైన, విహంగముల
ఏగానములనైన
నేటి ఏ అరుణ రాగములనైన
అనురాగమున సిక్తమొనర్చి పంపజాల
కున్నాను
నీ కరముల లోనికి
నేటి నుండి శతవర్షముల పిదప.

౨

అయినను, నీవు ఒకసారి, తెరచి దక్షిణ
ద్వారమును
కూర్చొని వాతాయనమున
సుదూర దిగంతమునచూచి, కల్పనలో
అవగాహన చేసి
ఆలోచించి చూడుము మనమున—
ఒకదినము శతవర్షముల పూర్వము
చంచలపులకరాశి, ఏదో స్వర్గమునుండి
తేలుచువచ్చి
ఎల్లర అంతరమున వచ్చి తగిలెను,
నవీన ఫాల్గుణదినము, సకలబంధన విహీనము
ఉన్మత్త అధీరము—
ఎగుర్చుచు చంచలపక్షములు, పుష్పరేణు
గంధావలిప్తములగు
దక్షిణ సమీరముల.

3

హఠాత్తుగవచ్చి, త్వరితముగ చిత్రిత
మొనర్చెను ఘనసేని
పావన రాగములతో,
మీకు శతవర్షముల పూర్వము.
ఆ దినము విలోలప్రాణముతో, హృదయమగ్న
గానములతో
ఒక కవి మేల్కొని——
ఎన్ని భావముల, పుష్పప్రాయ సమముగ
వికసిత మొనర్చి లేవనెత్తకోరెనో
ఎన్నో అనురాగములతో
ఒక నాడు శతవర్షముల పూర్వము.

౮

నేటినుండి శతవర్షముల పిదప
ఇప్పుడు పాడుచున్నది ఎవరు ఆ నూతనకవి
మీ గృహముల ?
నేటి వసంతపు ఆనంద అభివాదనముల
పంపుచున్నాను అతని కరముల.
నా వసంతగానములు నీ వసంతదినముల
ధ్వనితమగుగాక క్షణకాలమునకై ;
నీ హృదయస్పందనముల, నవభ్రమర
గుంజనముల
పల్లవ మర్మరారవములలో ;
నేటినుండి శతవర్షముల పిదప.

చిత్రా :
ఫిబ్రవరి ౧౮౯౬

అనువాదము :
౫-౭-౪౪
Gardener—LXXX

# ౨౦

# అంత్య నమస్కారము

ఒక్క నమస్కారమున, ప్రభూ, ఒక్క
నమస్కారమున
నా సకలేంద్రియములు జీరాడనిమ్ము
నీదు ఈ ప్రపంచమున.
ఘన శ్రావణమేఘము మాదిక్క, రసభారముచే
నమ్రము గతము
ఒక్క నమస్కారమున, ప్రభూ
ఒక్క నమస్కారమున
నా సమస్త మనోభావములు పడి ఉండనిమ్ము
నీదు భవన ద్వారమున.

## ౨౦. అంత్య నమస్కారము

నానాస్వరముల ఆకుల ధారలు
తన్మయత్వమున మిళితములై
ఒక్క నమస్కారమున, ప్రభూ,
ఒక్క నమస్కారమున
సమస్త గానము సమాప్తమగును
నీరవ పారావారమున.
మానస సరోవరయాత్రికులగు
రాజహంసల భంగి
సకల దివసరాత్రములు
ఒక్క నమస్కారమున, ప్రభూ,
ఒక్క నమస్కారమున
నా సమస్త ప్రాణవాయువులు ఎగిరిపోగలవు
మహా మరణపారమున.

గీతాంజలి :
ఆగస్టు ౧౯౧౦

అనువాదము
౧౪-౧౦-౫
Gitanjali 1